47

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] [సంచిక 12

15 మార్చి 1953





సంపాదకులు:

శ్రీయుత మహావాది వెంకటరత్నముగారు బి.ఎ.

వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు.

రామా అండ్ కో,
H.O. ఏలూరు

V.S. GURU

# విషయసూచిక

# హారతి

ఓలేటి పంచముఖేశ్వరరావు

శ్రీకాకుళంలో జననమంది, అమరావతిలో ఆటలాడి,
రాజమహేంద్రంలో రాజ్యంచేసిన ఆంధ్రికి హారతులు !!!
"జై ఆంధ్రావనీ!" సర్కారుజిల్లాలవారి యీచల్లనివాక్కు –
"విశాలాంధ్ర వర్ధిల్లాలి"–హైదరాబాదు తెలుగుల యీఅమృతవాక్కు.
"ఆంధ్రులందరు ఒక తల్లిబిడ్డలు" – రాయలసీమవారి ఈ రత్నాలవాక్కు –
"సరిహద్దు నిర్ణయసంఘాన్ని నియమించి తెలుగుప్రాంతాలను నూతన
రాష్ట్రంలో చేర్పించాలి" – రాష్ట్రేతరాంధ్రుల యీరమణీయవాక్కు.
"ఆంధ్రానామనేకత్వంకాదు ఆంధ్రులు ఆదర్శవాదులు" –
ప్రవాసాంధ్రుల యీబంగారువాక్కు –
"మాచిరకాలవాంఛలకు కల్పతరువు వాంఛూ" –
ముక్కోటి ఆంధ్రుల యీ ముద్దులవాక్కు –
"25 జిల్లాలో 3 కోట్ల ఆంధ్రులచే మాట్లాడబడే
ప్రామాణికభాష తెలుగే రాజభాషకావాలి" –
భాషావాదుల యీ బంధురవాక్కు
"మేము 15 వ శతాబ్దంలోనే విశాలాంధ్ర
సాహిత్యసామ్రాజ్యాన్ని స్థాపించాము"
పూర్వకవుల యీ పునీతవాక్కు,
"సంస్కృతాన్ని చెలికత్తెగా, హిందీని సోదరిగా, చేసి
కొన్న, తెలుగు సాహితికి జేజేలు" – కళామూర్తుల
యీ కమనీయవాక్కు,
ఈ దివ్యవాక్కుల కన్నిటికీ దిగ్విజయం కలగాలి !!

పండిన సంక్రాంతి నూతన రాష్ట్ర నిర్మాణానికి పునాదులు వేస్తే విజయ "ఉగాది" విజయోత్సవాలు చేయిస్తుంది !

హారతులు !! ఆంధ్రికి మంగళహారతులు !!!

* * * *

కం. తెలుగుల జండా ధగ—ధగ
తెలుగుల భేరీరవంబు దిక్కుల ఢాం—ఢాం—
తెలుగు జయఘంట గణ—గణ—
తెలుగుల శంఖాల్మ్రోత దిక్కుల భం—భం—

# బేసిక్‌విద్య - ప్రభుత్వబాధ్యతలు

(సర్వహక్కులు రచయితవి)

శాకరపర్తి కామేశ్వరశాస్త్రి, బేసిక్ టీచర్; ఖండవిల్లి.

వెనుకటి వ్యాసములలో బేసిక్ విద్యమ గురించిన వివిధవిషయాలను గూర్చి చర్చించుకొనుటయే గాక, ఈవిధానము జయప్రదమగుటకు ఎవరెట్టి పాత్రను తీసికొనవలయును? ఎట్టి బాధ్యతలు నెరవేర్చవలయును? మొదలగు విషయములను గూర్చి విపులముగా చర్చించుకొని యున్నాము.

ఐతే ఎవరిపాత్రను వారు చక్కగా నిర్వహించినను, ప్రభుత్వము వీరిపై పర్యవేక్షణ చేయచు, తగిన ఆర్థికసహాయము మొదలగునవి చేసిన నాడు గాని యీవిధానము సర్వతోముఖముగా అభివృద్ధి నందజాలదు. ఈక్రిందివిషయములలో నైనను ప్రభుత్వము శ్రద్ధ తీసుకొనుట అవసరము.

మంత్రుల నియామకము :

రాష్ట్రములలోను, కేంద్రములోను, విద్యామంత్రులుగా, విద్యావిషయములు తెలిసినవారు, విశేషించి బేసిక్‌విద్య పరిచయుం వున్నవారు, దానియందు ఆదరాభిమానాలు గలవారు, ఉత్సాహవంతులైన యువకులు, నియమింపబడుట అవసరము. ఈవిషయమును గురించి యింతకంటె మనము లోతుగా చర్చించుట మంచిదికాదు. ఏమైనను ఈ విధానము జయప్రదము కాకపోవుటకు ఈ మంత్రుల నియామకము కొంతకారణము కాకపోదు.

ఉద్యోగుల నియామకము :

ఉపాధ్యాయులు, పరీక్షాధికారులు, మొదలగు వారిని నియమించునపుడు వారికి యీవిద్యలో గల ప్రత్యేకాసక్తి, నిపుణత, అనుభవము, శీలము, నిజాయితీ మొదలగు విషయములు పరిశీలింపబడవలయును. అందరికిని సంపూర్ణమైన శిక్షణ గఱుపబడవలయును. స్వల్పకాలశిక్షణల నిచ్చి ఉద్యోగులుగా నియమించుట ప్రమాదకరము. సమర్థులను విద్యాశాఖలోనికి ఆకర్షించుటకు వేతనముల నభివృద్ధి చేయుట అవసరము. తక్కిన ఉపాధ్యాయులు మొదలగు ఉద్యోగులకంటె ఈశిక్షణ పొందినవారికి ప్రత్యేకసదుపాయములు చూపుటవలన కూడా ఈ విధానము త్వరగా అభివృద్ధి నందగలదు. అందువలన సమర్థులైన ఉద్యోగులను కుల, మత, లింగవ్యత్యాసము కొకుండ, నిష్పక్షపాతదృష్టితో నియమించుట ప్రభుత్వబాధ్యతలలో ముఖ్యమైనది.

ప్రచారము :

నేను మొదట వ్యాసములోనే చెప్పినట్లు ఈ విధానమును గురించి ప్రజలలో ప్రచారమవసరము. అందుకుగాను ప్రభుత్వమువారు అక్షరాస్యులలోను, నిరక్షరాస్యులలోను, ఈవిధానముయొక్క ఉత్కృష్టతను గురించి ప్రచారముచేయూట మంచిది. అక్షరాస్యులలో ప్రచారమునకుగాను ఈవిధానములో నిపుణులైనవారిచే ఈవిద్యను గురించి పుస్తకములు వ్రాయించి, వానిని ప్రాంతీయభాషలలోని కను వదింపచేయవచ్చును. ప్రత్యేక పత్రికలు స్థాపించుటగాని, లేక అందుకు ప్రోత్సాహము నిచ్చుటగాని, చేయవచ్చును. నిరక్షరాస్యులలో ప్రచారమునకుగాను మ్యాజిక్‌లాంతరులు, ఉపన్యాసములు, మొదలగునవి మంచి సాధనములు. ప్రభుత్వమువారు నిర్మించు డాక్యుమెంటరీలలో ఈవిద్యను గురించిన వానిని తయారుచేయించి సినీమాశాలలలో ప్రదర్శింపజేయవచ్చును. ప్రచారవిషయములో ప్రభుత్వమునకు ఈశిక్షణ పొందినవారి సహాయ సహాకారములు మిక్కిలి కావలెను. ఎట్లన వారును ప్రభుత్వముతో బాటు వివిధరూపములుగా గ్రామములలో ప్రచారము చేయవలయును.

ఆర్థికవిషయము:

"విత్తముకొద్ది వైభవము" అన్నట్లు అన్నివిషయములకు ఈ రోజులలో ధనము మిక్కిలి అవసరము. కాని మన ప్రభుత్వమును ప్రస్తుతము అనేక సమస్యలు పీడించుచున్నవి. ప్రజలకు వలయు కనీసావసరములను సమకూర్చుటకే ప్రభుత్వమునకు కష్టమగుచున్నది. పైగా యీ బేసిక్‌విద్యను సర్వత్రా అమలుపరచుటకు వలయు ధనమును సమకూర్చుట

కష్టము. ఏ విధమగు ఖరీదైన ఉపకరణములు వగైరా లేకనే, ఆకర్షణీయమగు భవనములు నిర్మింపకుండానే, ఉపాధ్యాయులకు జీతములు తప్పక యిచ్చుచుండగానే, ఈ విద్యావిధానము ప్రజలందరికి ఉచితముగా నిర్బంధముగా యిచ్చుట సాధ్యమగుటలేదు. ఇట్టి పరిస్థితిలో ఖరీదైన పరికరములు, విశాలమగు పాఠశాలా భవనములు, బడితోట, ఆటస్థలము, మొదలగునవి తప్పకుండా అవసరమైన యీ విధానము ప్రజలందరకును అందుబాటులో నుండునట్లు చేయుట యెంతకష్టమో యాలోచింపుడు! అట్లని నిరాశ చెంది యూరకున్నా "ఆచిత్వరలో హిందూదేశీయులందరు విద్యావంతులు కావలయును" అన్న మాలక్ష్యము ఎప్పటికిని నెరవేరదు. అందువలన ప్రభుత్వము విద్యకూడ దేశరక్షణ, ఆహారము, మొదలగు వానివలె అతి ముఖ్యమైనదని గ్రహించి, వెనుకాడకుండ విద్యాభివృద్ధికి ధనవ్యయము చేయవలసియున్నది. ఈ విషయములో ఉదారులగు ధనవంతులయొక్క సహాకారము మిక్కిలి అవసరము. ఇట్టి సహాకారము ప్రస్తుతము కొంత లభ్యమగుచున్న మాట నిజమైనప్పటికి ప్రతిగ్రామములోను పాఠశాలల యభివృద్ధికి ఆ గ్రామస్థులు తోడ్పడవలసియున్నది. ఉపాధ్యాయులు మొదలైన ఉద్యోగులకు ప్రతినెల సకాలములో జీతములిచ్చుటవంటి సౌకర్యములు చేయుట విషయములో ప్రభుత్వము అత్యంత సానుభూతితో వ్యవహరింపవలయును.

మన రాష్ట్రపు ముందంజ :

ఇతరవిషయములలోవలెనే మనరాష్ట్ర ప్రభుత్వము ఈ విషయములోకూడ ముందంజవేసి ఈ విద్యావిధాన సత్వరవ్యాప్తికి కృషిచేయుచుండుట కడు ముదావహము. కాని యీ కృషి యింకను మందకొడిగా సాగుచున్నదనియే చెప్పవచ్చును. ప్రత్యేకాంధ్రరాష్ట్రము నిర్మించబడినందునను, మద్యపాన నిషేధము మొదలగునవి రద్దుపరచి తద్వారా వచ్చు ధనము విద్యకు ఉపయోగింతురని నాయకులలో అభిప్రాయమున్నట్లు తెలియుచున్నందునను, భావి ఆంధ్రరాష్ట్రములో బేసిక్ విద్యకు ప్రముఖమైన స్థానము లభింపగలదని యాశించవచ్చును. దీని అభివృద్ధికి నాయకులు, ప్రభుత్వ నిర్వాహకులు, శాసనసభ్యులు, మొదలగువారు పాటుపడవలయునన్న దాని ప్రాశస్త్యము వారికి బోధపడవలసియున్నది. ఇది కేవలము వంటచేసుకొని, అంట్లు తోముకొని, వీధులూడ్చుకొనే విద్యగా వారికి గోచరించి నంతకాలము దీని అభివృద్ధి చురుకుగా జరుగదు. కాబట్టి ప్రతివారికి దీనినిగురించి తెలుసుకొనే వీలు కలుగజేసి, వారి సంశయాలను నివృత్తిచేసుకొనుటకు అవకాశాలు కల్పించాలి. ప్రభుత్వము, విమర్శలను సుహృదయంతో స్వీకరించాలి.

ఇకపోతే సామాన్య ప్రజలలోనేకాక ఈవిధాన ప్రాశస్త్యమును గుర్తించినవారుకూడా "ఈ విధానము మంచిదేకాని యెంతవరకు జయప్రదమగునన్నది సంశయాత్మక విషయము" అనుచుందురు. మరికొందరు "ఆచరణలో కష్టసాధ్యముగా నున్న" దని చెప్పుచుందురు.

నేనీవ్యాసము వ్రాయు సమయమునకు గాంధీజీకి నైతిక వారసులును, అఖిలభారత కాంగ్రెసు సంఘాధ్యక్షులును, యావద్భారత పరిపాలనాభారమును భుజస్కంధముల ధరించిన వారును "అవనికే ఆశాజ్యోతి" యైనవారును విశేషించి బేసిక్ విద్యను మిక్కిలిగా అభిమానించువారును, అగు పూజ్య శ్రీ జవహరు పండితుడు ఫిబ్రవరి 15 వ తేదీని ఢిల్లీలో మోడరన్ హైస్కూలు వార్షికోత్సవంలో చేసిన ఉపన్యాసం చదువుట తటస్థించినది. వారు విద్యనుగూర్చి వివిధదృక్పథములలో పరిశీలించి బేసిక్ విద్యనుగురించి చెప్పుచు "కాలేజీలలోకూడా యీ విద్యావిధానమును ప్రవేశపెట్టాలను కుంటున్నాము, కాని యీ విద్యావిధానం కొంచెమైనా ముందుకుసాగక పోవడం విచారం కలిగిస్తున్నది" అన్నారు, ఇందుకు కారణమేమిటన్న మాట అటుంచి యీ విధానం అనుకున్నంత త్వరగా అభివృద్ధికావడం లేదన్న అభిప్రాయం నెహ్రూ వంటివారికి కూడా కలదని మనము తలంచవచ్చునేమో, అంతమాత్రంచేత దీనికి భవిష్యత్తులేదని నిరాశచెంద నక్కరలేదు. ఈ విధానపు ప్రాశస్త్యాన్ని గ్రహించియు ప్రభుత్వము ఆర్థికముగాను, మరి యితరవిధములుగాను, ఎదుర్కొనుచున్న చిక్కులచే దీనిని త్వరగా అమలుపరచలేక పోవుచున్నదని మాత్రమే అనుకొనుట యుక్తము.

ఏమైనప్పటికి ప్రభుత్వము యిప్పటి కంటె యెన్నోరెట్లు శ్రద్ధతో చురుకుగా ఈ విధానమును దేశమంతట వ్యాపింపజేసి ఉన్నతపాఠశాలలు, కళాశాలలలో కూడా ప్రవేశపెట్టి, విద్యార్థులు యిప్పటివలె ఉద్యోగం దొరికితేనే బ్రతుకగల వారినిగాకాక, తమకు, దేశానికి ఉపయోగపడుతూ తమ

జీవితాన్ని సుఖప్రదముగా గడుపుకొనగల వారినిగా తయారు చేయాలి. లేనిచో ఇప్పటికే అనగా 15% అక్షరాస్యులుగా నున్నప్పుడే తీవ్రరూపము దాల్చిన నిరుద్యోగ సమస్య అందరు చదువుకొన్న వారుగా తయారైనప్పుడు ఏవిధముగా తయారగునో ఊహించుటకూడా కష్టము. నిరుద్యోగ నిర్మూలనమునకు ఏకైకసాధనము బేసిక్ విద్య. దీనిని అన్ని దశలలోను ప్రవేశపెట్టి, విద్యార్థులను సంపూర్ణ పౌరులుగా తయారుచేయడమే మనకర్తవ్యము. ఆనాడే భరతదేశము తొంటియౌన్నత్యమును పొందగలుగును. అంతవరకు మన విద్యా విధానములోను, తద్ద్వారా మనజాతిలోను, బానిసత్వము నశించదు. కనుక యితరులతోపాటు ప్రభుత్వముకూడా తన విధ్యుక్తధర్మమును గుర్తెరింగి తన బాధ్యతలను నిర్వర్తించగలదనియు, ఈ విధానము ద్వారా దేశము సర్వతోముఖాభివృద్ధినందని. శాంతి నెలకొనుననియు, తద్ద్వారా పూజ్యబాపూజీ ఆత్మకు శాంతి కలుగుననియు, ఆశింతము! జైహింద్



# * మనవి *

నేను ఉపాధ్యాయుల శ్రేయస్సునుకోరి పనిచేయు "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య" "ప్రారంభవిద్య" మొదలగు పత్రికలలో బేసిక్ విద్యనుగూర్చి తదితర ఉపాధ్యాయ సమస్యలనుగురించి, వ్యాసములు వ్రాయుచుండుట పాఠకమహాశయులకు తెలిసినవిషయమే. ఒక్కొక్కప్పుడు విషయ విపులీకరణముకొఱకు ఉదాహరణగా వేరొకవిషయము ప్రస్తావింపవలసి వచ్చుచుండును. అట్లు ప్రస్తావించిన విషయములు ప్రత్యేక వ్యక్తులనుద్దేశించినవని కొందరు భావించుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

ఉదాహరణకు, ఫిబ్రవరి నెలలో "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య"లో ఉపాధ్యాయ సంఘములను గూర్చి వ్రాసినవ్యాసములో ఓట్లకొరకు లక్షలాదిఖర్చుచేయు అవినీతిపరులుకూడా ప్రజాసేవచేయుదుమనియే చెప్పుదురని వ్రాయుటజరిగినది. అంతే అది ఎవరోఒక శాసనసభ్యునిగాని, లేక జిల్లాబోర్డు అధ్యక్షుడు, మ్యునిసిపల్ చైర్‌మన్, వర్తకులనుగాని, మరియొకరినిగాని, వ్యక్తిగతముగా నేనువిమర్శించితినని భావింపరాదు. ప్రస్తుతము ఆపదవులు నిర్వహించుచున్నవారిలో అట్టివారున్నారని నాయభిప్రాయ మెంతమాత్రము కాదు. ఈవిషయమును మచ్చునకు ఉదహరించితిని. అట్లేనారచనలోని విషయములు ఎవరిని ఉద్దేశించినవి గావు.

నాకు ఉపాధ్యాయుల సమస్యల యెడలగల సానుభూతిని పురస్కరించుకొని, వాటిని పత్రికల ద్వారా తెలియపరచుటకు ప్రయత్నింతునేకాని వేరుకాదు. నాకు ప్రభుత్వము యెడలగాని, ఉన్నతాధికారులయెడగాని, ఉపాధ్యాయసంఘనిర్వాహకులయెడగాని, గౌరవభావముతప్ప వేరుభావములేదని యిందు మూలముగా మనవిచేయుచున్నాను. అపార్థములకు తావులేకుండుటకై యీప్రకటనచేయుచున్నాను.

ఖండవిల్లి　　　　　　　　　　　　　　　　　　　　　　ఇట్లు
20-2-1953　　　　　　　　　　　　　　　　　కాకరపర్తి కామేశ్వరశాస్త్రి.




నిష్ఠల అప్పలనరసయ్య, బేసిక్ టీచరు, చోడవరం

రామశర్మ ప్రాథమికపాఠశాలఉపాధ్యాయుడు. భార్య సుందరమ్మ గయ్యాళిగంప. శర్మజీతం ఏబది రూపాయలు. ట్యూషన్లవల్ల ఒక యిరువదిరూపాయలు వస్తాయి. రాబడి తక్కువ. ఖర్చుఎక్కువ. కుచేల సంతానం. అందులో సగంమందికి పైగా ఆడపిల్లలు. ఏడ్చేపిల్లల్ని, అల్లరిచేసే పిల్లల్ని, ఓదార్చే నిమిత్తం వారికి ఏవేవో తెస్తానని చెప్పి, బడికి వెళ్లేవాడు. ఇలా వుండగా ఒకనాడు శర్మ పిల్లలతో అరచి అరచి, ఆయాసంతో యిల్లు చేరుకున్నాడు.

పెద్దబ్బాయి:— నాన్నా! నాకు సైకిలు తెస్తానన్నావు. తెచ్చేవా?

రెం॥అబ్బాయి:— నాన్నా! నాకు కాణీ యిస్తానన్నావు. యిస్తావా!

మూ॥అబ్బాయి:— నాకు పిప్పరమెంట్లు తెస్తానన్నావు. తెచ్చేవా?

మొ॥అమ్మాయి:— నాన్నా! నాకు "చందమామ" పుస్తకం కొంటానన్నావు. కొన్నావా?

రెం॥అమ్మాయి:— నాన్నా! నాకురిబ్బన్లుతెచ్చేవా?

మూ॥అమ్మాయి:— నాన్నా! నాకు బొమ్మలు కొన్నావా?

సుందరమ్మ:— ఏమండీ! ఎన్నాళ్ళీ ముష్టిగుడ్డతో వుండేది? పదిమందిలో తిరగడానికిసిగ్గువేస్తున్నది! ఎప్పుడు చీరకొనమన్నా ఏవో లేనిపోనిసాకులు చెప్పి, వాయిదాలు వేస్తున్నారు. ఈవేళ సాయంత్రం లోగా చీరకొనకపోతే లాభంలేదు! ఏమండి! ఎదిగినఅమ్మాయిని ఎంతకాలంయింట్లో పెట్టుకుంటాము? నీలాటిరేవుకి వెళ్ళేసరికి పదిమంది అమ్మలక్కలు నోటికొచ్చిన కూతలు కూస్తున్నారు. మీకేమి పోయింది మగరాజులు! ఏబాధ అయినా నాదేకదా! మీకెంతసేపూ ఆ దిక్కుమాలిన బడి, కుట్టికథలుతప్ప, యింక యింటిబాధ్యత ఏమీలేదుకదా! సరే అయిందేదో అయింది! యిప్పటికైనా మంచి సంబంధము చూసి, ఆమూడుముళ్లు వేయించండి! అని ఉపన్యసిస్తూండగనే పాలమనిషి ప్రత్యక్షమయింది.

పాలమనిషి:— ఏమిబాబు! ఈవేళైనా పాలడబ్బులు యివ్వకపోతే వ్యాపారం ఎలాగచేస్తాము? ఎప్పుడడిగినా రేపురా, మాపురా, అని చెప్తున్నారు. అంత డబ్బు యిచ్చుకోలేకపోతే వాడిక మానుకోండి! యింక మరి తిరగలేను!.

ఈ విధంగా పదిమందీ యమదూతలవలె పీడించినప్పటికీ ఓర్మిగల శర్మ ఎవ్వరికీ ఏ జవాబు యియ్యలేకపోయేడు! అన్నిప్రశ్నలకు జవాబు మౌనమే! ఆనాడు రాత్రి జరిగిన సంఘటనను తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొనేసరికి జీవితంమీద రోతపుట్టింది! అందులో "బడిపంతులు" జీవితమంత అధ్వాన్నం మరొకటి వుండదు. పగవారికైనా వొద్దుబాబూ ఈ దిక్కుమాలిన బడిపంతులు ఉద్యోగం. జీతం ఎక్కువ చేయమని ప్రభుత్వం వారితో మొరపెట్టుకొంటే ఆర్థికపరిస్థితులు బాగులేవు! పాపం! మీరుపడుతున్న శ్రమలు మాకుతెల్సు! కొంతకాలం ఆగండి!" అని సానుభూతివచనాలు పల్కుతారు! కొంతకాలం అంటే ఎంతకాలం అనే ప్రశ్నకు జవాబురాదు! భావిపౌరులను తయారుచేసేవారు అని ఏవేవో బిరుదులు యిస్తారు. ఏమిలాభం? అరజీతంతో, అరభోజనంతో, అర్ధజీవితం గడపాలి!" అని అనుకొని రామశర్మ భార్య పిల్లలను కడసారి చూపుచూచి, యిల్లు విడిచేడు! మర్నాడు నూతివద్ద యినుకవేస్తే రాలకుండా జనం మూగేరు. ఏమిటి అని అడిగితే



## 8 వ తరగతి పబ్లికుపరీక్ష - తెలుగు మాదిరి పత్రాలు

ఆర్యా !

ఈమధ్య మన పత్రికలో 8వ తరగతి పబ్లికుపరీక్షకు "మాదిరి పత్రాలను" అన్ని పరీక్షా విషయము లకు ప్రకటిస్తున్నారు. "తెలుగు"లోని పరీక్షకు మాదిరిపత్రములలో ఒకవిషయము [illegible] గమనింపబడినట్లు కనుపించుటలేదు. 6, 7, 8, తరగతులలో భాషాబోధనకుగాను డిపార్టుమెంటువారు నిర్ణయించిన సిలబసు లోని అన్నిఅంశములను, యీఉపాధ్యాయులు పరీక్షాపత్రములను తయారుచేయుటలో, ఉపయోగించు చున్నట్లు కనుపించలేదు.

సామాన్యముగా అన్నిపబ్లికు పరీక్షాపత్రములలోను 8 వ తరగతి ఇంగ్లీషు పరీక్షా పత్రములలో కూడా-యిప్పుడు ఉపయోగించుచున్న నూతన రకపు ప్రశ్నలను, 8 వ తరగతి తెలుగు పరీక్షా పత్రము లలోకూడ ఉపయోగించుట అవసరము. ప్రశ్నలకు అడిగినటువంటి జవాబులను (ఒకటి రెండు వాక్యముల లోనో, ఒకపేజీలోనో, రెండుపేజీలలోనో) వ్రాయుట యిచ్చిన గద్య లేక పద్య భాగముల సారము మీద అడిగిన ప్రశ్నలకు జవాబులు వ్రాయుట; విరామ చిహ్నములతో పాఠభాగములను వ్రాయుట. వాక్యముల రూపములను కోరినట్లు మార్చివ్రాయుట యిచ్చిన పదములను సొంతవాక్యములలో నుప యోగించుట, రకరకముల వాక్యరచన వ్యాసరచన, లేఖారచనలను, వ్రాయుట-సిలబసులో సూచింపబడి అన్నిపద్ధతులను వినియోగించి, పాఠ్యపుస్తకములోని భావములను భాషను, వాటిప్రయోగమును, విద్యార్థు లకు అనుభవసిద్ధముచేయుట-అట్టి అభ్యాసఫలములను పరీక్షించుట-నీటిని యిట్టి మాదిరి పత్రములలో నుపయోగించవలసినట్లు తోచుచున్నది. ఈ మాటను ఉపాధ్యాయులు గమనింతురుగాక !

(ఉపాధ్యాయుడు)

---

[illegible] వ పేజీ తరువాయి

సూతిలో ఎవరో తేలేరు అని చెప్పేరు! తీరా పైకి తీసేసరికి బడిపంతులు రామశర్మ! అయ్యో పాపం అని కొందరు, చచ్చిసాధించేదేమిటి? అడదానిలాగ- అని కొందరు, యీలాగ ఎవరికి తోచినట్లు వాళ్ళు అన్నారు. నూతిగట్టుకి ఏదో కాగితం అంటించివుంది- చూడండి-అని ఒక ముసలాయన అన్నాడు. ఆకాగి తంలో ఈ విధంగా వుంది!

అర్ధజీతంతో, అర్ధభోజనంతో, ఈఅర్ధానపు అర జీవితమును గడిపినంతకాలం గడిపేను. యింక గడప లేను. నా ఆత్మహత్యకు కారణం పై ప్రతికూల పరిస్థితులే !

అభాగ్యజీవి,

రామశర్మ

పై కాగితమును చూచి, అందరూ కన్నీటితో ఆకాగితాన్ని తడిపేరు. మర్నాడు పత్రికలలో "జీవితంపై విరక్తిజెంది ఆత్మహత్య చేసికున్న బడి పంతులు" అనేలాటి కొయ్యంత అక్షరాలతో ప్రచు రించేరు. ఈవిధంగా ఈవిశాలవిశ్వంలో చాలీచాలని జీతంతో బడిపంతులు ఉద్యోగం చేయలేక ఎంత మంది మృత్యుదేవతకు ఆహుతి అవుచున్నారో! ఈబాధలు హృదయమున్న మానవులకు తప్ప యితరులకేమి తెల్సు ?



# విద్యాప్రబోధము    వి. యల్. నరసరాజు - టీచరు - తిమ్మాపురం

("పెళ్ళిచేసుకొని - ఇల్లుకొచుకొని" అనుపాటమాదిరి)

ఆలాపన—

ఓ భావిభారతభాగ్య పౌరులారా!
విద్యార్థి - విద్యార్థినులారా!
స్వానుభవమున నొసగు నా సలహాలివే!

మట్టుమార్పు—

బడికి వేళకూ శ్రద్ధగవచ్చి
దీక్షతో విద్యను నేర్వాలోయ్!
గురువుల మెప్పును పొందాలోయ్!
మీ రందరు కీర్తిని తేవాలోయ్! (బడికి)

ఆలాపన—

పురాతనపు పోకడలు దూరముగ పారద్రోలి
నవీన పద్ధతులతో నయముగ విద్యను నేర్చి
వినయ విధేయతలు రాణింప
కన్నవారు చూచి సంతోషపడగా

మట్టుమార్పు—

తల్లిదండ్రుల బంధుమిత్రుల
ప్రీతికి పాత్రులు కావాలోయ్!
ఐకమత్యముగ మెలగాలోయ్!
మంచిని మరిమరి కోరాలోయ్! (బడికి)

ఆలాపన—

పాఠశాలాభివృద్ధికి పాటుపడే
ఉపాధ్యాయుల ఉత్సాహమునకు తోడు
విద్యార్థులందరు విసుగులేక విద్యను నేర్చి

మట్టుమార్పు—

ఆటపాటలతో ఆనందముగ
విద్యను శ్రద్ధగ నేర్వాలోయ్!
మీనాన్నలకు కీర్తిని తేవాలోయ్!
మరిపెద్దల మెప్పును పొందాలోయ్! (బడికి

# భారత భాగ్య విధాతా!

రచన:—రుద్రాభట్ల వేంకట భాస్కరరావు.

భారత భాగ్య విధాతా । భావి పౌర నిర్మాతా
జీవితమే రోతా నీ । జీవితమే రోతా ॥భారత॥

1. నాయకులు మహాగాయకులూ । సార్వభౌములూ సత్కవీంద్రులూ
మన్ననజేసే విద్యాదాతా । యేలకలిగె నీమది రోతా ?
జీవితమున సంతటిరోతా ॥భారత॥

2. దరిద్రదేవత తాండవించుటకు । తావు నీదు గృహ మాయె నహో
అరాకలితో అలమటించుచూ । మలమల మాడిరా నీవారూ
ఈ అనర్థమును దొలగింపగ నిల । నెవరుకూడ లేనేలేరా ॥భారత॥

3. భారతదేశపు ఘనస్వాతంత్ర్యం । బాబూ ప్రసాదు పటుసారథ్యం
పండిత జవహరు ఫల్గుణత్వమూ । శోధించునులే నీ కష్టం
సాధించును నీకై సర్వం ॥భారత॥

---

# బోధకా!

మ॥ "కనికారంబు వహింపుడే యని నమస్కారమ్ము గావింపవో!
వినుఁడీ మా మొఱ లంచు దుఃఖపడుచున్ వేమారు వాక్రువ్వవో!
దినముల్ పుచ్చుట కష్టసాధ్య మనుచున్ దీనత్వముం జూపవో!"
కనువా రెవ్వరు లేనలే రకట! నీ కష్టంబులన్ బోధకా!

ఉ॥ దండిగ జీత మీయరని దండుగటంచు చెద నిశ్చయంబునం
"దిండికి వాచి నే నెటుల దేశప బోధన సేతునంచునుం
బిండికొలంది రొట్టె యని బిడ్డల కేమియు జెప్పకుండగా
నుండుట కిచ్చగింపక మహోన్నతులం బొనరింతు బోధకా!

చం॥ చినిఁగినగుడ్డ వైచుకొని చెచ్చెరవేళ యతిక్రమించె నం
చును బడి కేగుచుండెదవు న్యూనత నీ కిటు లార్థికంబుగా
ఘనత దొరంగ మున్ను పరికల్పనఁ జేసిన బ్రహ్మదేవునిన్
అనవలె; మార్గదర్శకుఁడ వక్కట! నీ కిదియేమి బోధకా!

మ॥ అనయం బోధకతోడ శిష్యులకు విద్యాబుద్ధులం జెప్పి నే
ర్చిన సత్యాన్వతి కెత్తు ప్రవర్తనము సర్వోత్కృష్టధర్మంబు లో
కోన్నత బోధించుచు నిత్యజీవన విధానాధార భూతంబులన్
ఒసరం గిట్టునసేవకు నీఋణం బెంతో గ్రాహ్యమే బోధకా!

ఉ॥ నీవన నీఋణం బనగ నీవొనగూర్చు ప్రపత్రనం బనం
గా వివరింప శక్యమె అకల్మష బుద్ధిని నీకు గల్గు వి
ద్యా విషయైక యోగ్యతల నన్నియు బాలుర కబ్బునట్లు ప్ర
జ్ఞా విభవంబునం దెలిపి జ్ఞానులుగా బొనరింతు బోధకా!

మ॥ అల దైవం బోసంగూర్పంగా వలయు నీ కామోదముం గల్గగా
వలె; జీతంబులు పెట్టువం పెరుగ లాభంబేమి? నీ వింతకుం
గళ బోషించుచు నుంటి; నిన్నిదియె విఖ్యాతంబుగాఁ జేయు; వం
దలు వేలిచ్చిన నీ ఋణమ్ము భువి సాంతంబైనదే బోధకా!

ఉ॥ చాలని జీత మిచ్చునెడ సంతస మేగతిఁ గల్గనోపు నీ
యాలును బిడ్డలున్ వెతలనందుట సైపఁగరాని దాటచేఁ
దాలిమి వీడి గట్టిగ సదా మొఱపెట్టిన దోషమౌనె! మం
త్రాలకుఁ జింతకాయ లిల రాలవటంచు నెఱింగి బోధకా!

శా॥ ఎన్నో ప్రార్థన లొనర్చితివి గానీ లాభ మేముండె? నీ
కన్న న్మిన్నగు దించి లోకమునకుం గల్యాణముం గూర్చు! మృ
ష్టాన్నంబైన భుజింప నోచవె! యుపాధ్యాయత్వపుంగల్మి! నో
యన్నా బోధకుఁ డౌచుఁ బోషకుఁ సౌమ్యా! వెఱ్ఱియే బోధకా!

మ॥ కుతుకం బొప్పఁగఁ జేరదీసి అనురక్తిన్ గొల్చి విద్యార్థులన్
మతిమంతుల్ దయించు జీవనము నిర్మాణంబు గావించి శా
శ్వత సౌఖ్యం బొనగూర్చు సద్యశము సంపాదించు టే మృగ్యమౌ
కృతకృత్యత్వం దగు ధన్యజీవి యగు నీవే యాదువో బోధకా!

ఉ॥ పేదతికంబు నీకగుట భీతి సహింపకు వేలొసంగ స
మ్మోదము బొందబోకు యశమున్ గడియించెడునట్టి వృత్తియే
గాదె సుఖంబుగూర్చు ధనకారణ మేమికొరంత గూర్చు! సాం
కేతిక గడించెడి ధనము? కీర్తిధ మట్టిదికాదు బోధకా!

రచన—కాచకొండ సూర్యనారాయణమూర్తి.

# ప్రభుత్వం బడిపంతుళ్ల సమస్యలను పరిష్కరించాలి

స్వతంత్రభారతాన్ని తీర్చిదిద్దగలిగిన నేటి ప్రాథమికోపాధ్యాయుల సమస్యలు నానాటికి విషమస్వరూపాన్ని ధరించి, తీవ్ర ఆందోళన కలిగిస్తున్నాయ్. భావిభారత నిర్మాతలగు మన బాలబాలికలను తేజోమూర్తులుగా తయారుచేయు పంతుళ్ల నిరుత్సాహస్థితి, మనరాష్ట్రాన్నేగాక యావద్భారతాన్ని కూడ కలవర పరుస్తున్నది. స్వాతంత్ర్యానంతర మైనా ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరింప బడుతాయన్న ఆశ అడుగంటింది. స్వాతంత్ర్యానికి ముందు స్వల్పవేతనాలతో, ఉక్కు చట్రంవంటి చట్టాలతో క్రుంగికృశించిపోయారు. నాటికి నేటికి వీరిదుస్థితిని గూర్చి విచారించే వారే లేరు. తీయని మాటలతో, పెద్ద పెద్ద ప్రణాళికలతో, కాలం శరవేగంతో గడచిపోతున్నది.

జాతీయ విద్యావిధానం, నిర్బంధ విద్యావిధానం, కరువు ప్రాంతాల్లో హాజరు సమస్య, సెంట్రల్ పేకమిషన్ స్కేళ్లు, మున్నగు సమస్యలను పరిష్కరించేందుకు ప్రభుత్వం యేమాత్రం ప్రయత్నించడం లేదు.

గతనాలుగేండ్లుగా క్షామపీడిత ప్రాంతాలైన రాయలసీమ, పల్నాడు మున్నగు చోట్ల ప్రాథమికోపాధ్యాయుల స్థితి మరీ ఘోరంగావుంది. గంజికేంద్రాలకు కూడ పంతుళ్లు హాజరవడం గమనిస్తే, వారు ఎలాంటి దుస్థితిలో వున్నారనేది స్పష్టంగా బోధపడుతుంది. ఇంతకు ముందే ఈ స్వల్పవేతనాలతో కూలిలకంటే హీనంగా బ్రతికే వీరు అర్థాకలితో, నగ్నహృదయాలతో, నిరాశాపూరిత మైన కాలచక్రాన్ని నడుపుతూ, భయంకర ఆర్థిక సంక్షోభములో పడి, దరికానక యున్నారు. దీనికి తోడు కొన్ని జిల్లాబోర్డులలో రెండుమూడు నెలలయినాకూడ ఉపాధ్యాయులకు జీతాలు పంపకపోతే ఈ దినాల్లో వీరిదుస్థితిని వర్ణించడం సాధ్యంగాదు.

ఆరేండ్లకు ముందే ఆర్థికస్థితిని బట్టి ప్రతి ఉద్యోగి వేతనం యెంతవరకు పెంచవలెనో పరిశీలించి నిర్ణయించుటకు, కేంద్ర ప్రభుత్వంచే నియమింప బడిన "సెంట్రల్ పేకమిషన్" వారి నిర్ణయాలను అమలు జరుపమని కోరినాకూడ, ప్రభుత్వం అమలు జరుపక పోవడం మిక్కిలి దౌర్భాగ్యం. ఆరుసంవత్సరముల క్రిందటనే ధరలకు తగ్గట్లు జీతాలుండాలని ఆమోదించి, తామునిర్ణయించుకొన్నసూత్రాన్ని అనాటికంటె ఈనాడు, అన్నివస్తువులధరలు ఆకాశాన్ని అంటుకుంటూవుండినాకూడ ఈనాటికికూడ అమలు జరుపకపోవడంచాలాశోచనీయం. ప్రతివస్తువుకు నేడు దేశంలో మండిపోతున్న ధరలను బట్టి ప్రభుత్వం పంతుళ్ళ స్కేళ్ళను పెంచి, సంతృప్తులను చేయవలసిన బాధ్యత ప్రభుత్వానిదే. అప్పుడే ఉపాధ్యాయులు అధికోత్సాహులతో కర్తవ్య పరాయణులై పురోగమిస్తూ భావిపౌరులగు మన బిడ్డలకు విజ్ఞానభిక్షను ప్రసాదిస్తూ, భావిభారత పౌరులుగా తీర్చి దిద్దగలుగుతారు. అప్పుడే మన భావిభారతాన్ని సవ్యపథాన పురోగమింపచేస్తారు.

ద్వితీయ పథకాలు మన దేశములో అంతరించినా కూడ మన విద్యావిధానం పూర్తిగా మారలేదు. ప్రతిభావంతులైన

విద్యావేత్తలతో సమాలోచనలు జరిపి, మనకనుగుణ్యమైన మన జాతీయ విద్యావిధానాన్ని నిర్ణయించుకొనేటట్లు చూడవలసి యున్నది. ఆనాడే మన జాతీయ విద్యావిధానంనుండి మనబిడ్డలు స్వాతంత్ర్యపిపాసులుగా, వీరయువతీయువకులుగా, ఆవిర్భవించగలరు.

మన జాతీయ విద్యావిధానాన్ని ఫలప్రదం చేసేందుకున్నూ, ప్రభుత్వంతో పూర్తిగా సహకరించేందుకున్నూ, పంతుళ్ల హక్కులు పూర్తిగా కాపాడడం అత్యవసరం. 1947 సంవత్సరములో మద్రాస్ ప్రభుత్వం ఉపాధ్యాయుల జీతాలు పెంచుతానని, తదితరసమస్యలను పరిష్కరిస్తానని, వాగ్దానం చేసింది. కాని ఇంతవరకు వాటిని పెడచెవిని పెట్టింది. వాటిని తీర్చాలని యెన్నోసార్లు విజ్ఞప్తులుచేసిన సంఘాలపైన టీచర్లపైన, తీవ్రచర్యకు దిగి దాడి జరిపించింది. తత్ఫలితంగా ఎంతోమంది నిరుద్యోగులై సంఘాలు విచ్ఛిన్నమైపోయినాయి. ఆఖరుకు ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయసంఘం కార్యదర్శి శ్రీసింగరాజు రామకృష్ణయ్యగారు (M. L. C.) సంఘ స్వాతంత్ర్యముపై హైకోర్టులో దావావేసి ప్రభుత్వంపై విజయం సాధించారు. కాన ప్రభుత్వం ఇప్పటికైనా పంతుళ్ళ న్యాయసమ్మతములైన హక్కుల కాపాడేందుకు పూనుకోవాలి.

మనరాష్ట్రములో దాదాపు 40 లక్షల నిరక్షరాస్యులు (బడియీడుగల బాలబాలికలు) అక్షరాస్యులు కావలెనంటే, ప్రభుత్వం శీఘ్రగతిని రాష్ట్రమంతటా నిర్బంధవిద్యను ప్రవేశపెట్టి, పేదవిద్యార్థులకు ఉచితభోజనవసతిని కల్పించే కనీస బాధ్యతను నెరవేర్చాలి. రాష్ట్రములో వివిధ మేనేజిమెంట్ల క్రిందవుండే ప్రాథమిక పాఠశాలలను ప్రభుత్వం స్వాధీనము చేసుకొని అందరికి ఒకేస్కేళ్లను నిర్ణయించాలి. కరువు పీడిత ప్రాంతాల్లో హాజరు సమస్యను తొలగించాలి. అనవసరముగా ఎట్టి విచారణ లేకుండానే సస్పెండు చేయబడిన ఉపాధ్యాయుల సర్టిఫికెట్లను పునరుద్ధరించాలి. రాయలసీమ, పల్నాడువంటి క్షామపీడిత ప్రాంతాల్లో జాతిసంపదయైన మన బాలబాలికలకు ప్రత్యేకమైన వసతి కేంద్రాలను నెలకొల్పి పుష్టికరమైన భోజన వసతి కల్పించాలి. పాఠ్యగ్రంథాల నిర్ణాయక సంఘములో సముచితమైన స్థానాన్ని యివ్వాలి. వృద్ధాప్యములో తగిన రక్షణ వసతులు కల్పించాలి.

ఉపాధ్యాయులు సంఘములో తలెత్తుకొని బ్రతకాలంటే, భార్యా బిడ్డలకు ఆరోగ్యం, విద్యాసదుపాయాలు విధిగా నెరవేర్చి, ఆర్థికంగా బాగుపడేటట్లు చూడాలి. మనభావిభారత పౌరులగుబిడ్డలు సుశిక్షితులుగా, సుపౌరులుగా, దేశభక్తులుగా, తయారయేందుకు తగిన విద్యాబుద్ధులు గరపాలంటే, పంతుళ్లు యేలాటి ఒడుదుడుకులు లేకుండా పాఠాలు బోధించేందుకు, వీలుకలిగించాలి.

కాన మనరాష్ట్ర ప్రభుత్వం 1953-54 సంవత్సరం బడ్జెటులోనైనా పంతుళ్ల సమస్యలను పూర్తిగా పరిశీలించి, వారి శ్రేయోభివృద్ధినిగాంచి, కనీసం కేంద్ర వేతన నిర్ణాయక సంఘం చేసిన సిఫార్సులనైన అమలుజరిపి ఉపాధ్యాయులను సంతృప్తుల చేస్తుందని మిక్కిలిఆశిస్తూవున్నాను.

శీలా వెంకటప్ప—టీచరు—కమలాపురం.

# మాదిరి ప్రశ్నపత్రము

8 వ తరగతి] గణితము [కాలము 2 గం॥లు

మార్కులు 100

I. (a) సూక్ష్మీకరింపుము.

$(\frac{3}{4}+1\frac{1}{2}\div\frac{3}{8})$ లో $\frac{1}{6}$

$2\frac{1}{3}\div(4\frac{1}{6}-1\frac{1}{2})$

(b) ఒక వృత్తాకారపు చెరువుగట్టు నుండి చెరువులో మధ్య పాతిన స్తంభమునకు 84 గ. దూరము ఆచెరువు గట్టుయొక్క చుట్టుకొలత ఎంత ?

II. కొంతసొమ్ము $4\frac{1}{2}$ సం॥లో రూ. 680 మొత్తమును, $5\frac{3}{4}$ సం॥లో రూ 730 మొత్తమును అగును ఆసలెంత ? రేటెంత ?

III. ఒక జమీందారుగారి తోటలో ·3 భాగము మామిడిచెట్లు, ·2 భాగము పనసచెట్లు మిగిలినవి తాటిచెట్లు. మామిడిచెట్లలో ·4 భాగము, పనసచెట్లలో ·5 భాగము తాటిచెట్లలోన 1/5 భాగము, కాపు పట్టలేదు. కాపుపట్టని చెట్లసంఖ్య 885 అయినయెడల తోటలోని మొత్తం చెట్లెన్ని? రకమున కెన్ని చెట్లుగలవు ?

VI. మూతగల యొక పెట్టెకు బయటి పరిమాణము 20″ 16″ 12″ దానిమూలవస్తువు ఘనము అది కాళీగానుండు నపుడు 1000 ఔన్సులు తూగును. నీళ్లతోనిండిన ఎంతతూగును ? (1 ఘ. అ నీళ్లు 1000 ఔన్సులు తూగును)

V. చతురస్రాకారముగల ఒక ఆటస్థలమునందు కర్ణము 160 గ. దానిలో చుట్టును 2 గ. వెడల్పు దారి వేయబడినది. దారిని గచ్చుచేయుటకు చ. అ. 1కి 2 అణాల చొ॥న ఎంత ఖర్చు ?

VI. ఇద్దరు పురుషులు, 4 స్త్రీలు, 9 మందిబాలురు, ఒక పనిని 20 దినములలో చేయగలరు. 3 మనుష్యులు, 6 స్త్రీలు, 12 మంది బాలురు, దానిని ఎన్నిదినములలో చేయగలరు ?

1 పు = 2 స్త్రీ = 3 బా

VII. ఒక సత్రమునుండి రైలుస్టేషనుకు 24 మైళ్ళదూరము గలదు. ఒకడు గంటకు 4 మైళ్ళ చొ॥న 16 మైళ్లుపోయి, కాలికిదెబ్బదగులుటచే మిగిలినదూరమును గంటకు 2 మైళ్ళ చొ॥న నడిచెను. అతని సరాసరి వేగమెంత ?

VIII. ఒక వర్తకుడు సైకిలును అమ్మి 12% లాభమును పొందెను. అతడు దానిని ఇంకా 54 రూ. ఎక్కువగా అమ్మియుండిన 48% లాభము వచ్చియుండును. అతడు కొన్నవెలఎంత ? అతడు సైకిలును ఎంతకమ్మెను ?

IX. **ABC** లకు రు. 123-12-0 పంచవలెను. C యొక్క భాగము B యొక్క భాగములో $\frac{5}{8}$; B యొక్క భాగము **A** యొక్క భాగము కంటె $1\frac{1}{2}$ రెట్లుండవలెను.

X. **ABC** ఒక త్రిభుజాకారపు పొలము. తూర్పు పడమరగానుండు అంచుపొడవు 150 అ. దక్షిణమునుండి ఉత్తరమువరకు 120 అ. స్కేలునకు పటమును గీచి **AC** యొక్క పొడవును కనుగొనుము.

సి హెచ్. ఆంథోని – టీచరు – ముస్తాబాద

# మాదిరిప్రశ్న పత్రము

8 వ తరగతి ] తెలుగు [ కాలము 2 గంటలు

I పరులకు హానిచేయఁగోరువారు తామె చెడిపోవుట తథ్యమని యెట్లు నిరూపింతువు?

లేక

ఆముక్తమాల్యద రంగనాథుల వివాహమును వర్ణింపుము. 10

II అంధేందూదయముల్ ......పద్యము పాదభంగముగాకుండ వ్రాయుము. 8

III చదువది యెంతగల్గిన......అను పద్యమునకు తాత్పర్యము వ్రాయుము. 8

IV ఈ క్రిందివానిలో ఒకదానికి మాత్రము సమాధానమిమ్ము.

(a) ప్రహ్లాదుడు తన తండ్రికి చేసిన హితబోధ.
(b) వీరమతిని రాజభక్తి.
(c) ఖాండిక్య కేశిధ్వజుల సంవాదము, దాని ఫలితము. 12.

V ఈ క్రిందివానిలో నేమూడింటికేని సమయ సందర్భములు వ్రాయుము.

(a) చెట్టు చెడు కాలమునకు కుక్కమూతిపిందెలు పుట్టును.
(b) రోటిలో తలదూర్చి రోకటిపోటుకు వెఱవదీయఁగా!
(c) మ్రానులేని దేశమందు ఆముదపుచెట్టు మహావృక్షము.
(d) ముందుబోయిన గోయి వెనుకేగిన నూయి.
(e) ఔరా! యితడింతటి తేనెపూసిన కత్తియా? 9

VI (a) దుఃఖభాగు లెవరు?
(b) కాపురుష లక్షణములేవి?
(c) సుహృద్గుణము లెవ్వి? 6

VII ఈ క్రిందివానిలో ఒకదానిని గురించి వ్రాయుము.

(a) రాజుల కొలుచుటకంటె నైచ్య మింకొకటిలేదు.
(b) కూడనివారితో స్నేహముకూడదు. 9
(c) నీచునకెప్పుడును మంచిగుణములు పట్టుబడవు.

VIII (1) ప్రత్యుపకారము, క్రొమ్మొయిలు, నేత్రోత్సవము, హృదంతము-సంధులు విడదీయుము. 4
(2) శార్ఙ్గము, జూదము, రాజ్ఞి, ప్రతిన - ప్రకృతి వికృతులను వ్రాయుము. 2
(3) భాగీరథి, మరాళము, ప్రబంధము, పురోహితుడు - వ్యుత్పత్తులు వ్రాయుము. 4
(4) దుష్కీర్తి, కూధము, సుకృతము, కృతజ్ఞత - వ్యతిరేకపదములు వ్రాయుము. 2
(5) వంశము, హరి, పక్షులు, వేణి - నానార్థములు వ్రాయుము. 2
(6) దాక, గారవము, కొలను, పతంగము - రూపాంతరములు వ్రాయుము, 4

IX కరువునివారణ, లేదా వయోజనవిద్యనుగూర్చి ఒక పుటవ్యాసము వ్రాయుము. 20

---

# మాదిరి ప్రశ్నపత్రము - గ్రూపు

8వ తరగతి] చరిత్ర [కాలము 2గంటలు

I మొగలాయి రాజ్యము క్షీణించుటకు కారణములేవి? ఔరంగజీబు దానికెంతవరకు కారకుడు? 10

II (a) రెండవకర్ణాటక యుద్ధము బ్రిటిష్‌రాజ్య స్థాపనకు పునాదియెట్లు? 5

(b) డల్‌హౌసీప్రభువు చేసిన ప్రజోపయోగములేవి ? 5

III హిందూదేశపటమునుగీచి వెలస్లీప్రభువునాటి ఆంగ్లరాజ్యమును గుర్తింపుము. 5

VI ఈ క్రిందివానిలో ఐదింటినిగూర్చి క్లుప్తముగా (Short notes) వ్రాయుము. 15

1. బాల్బను 2. రిప్పన్‌ప్రభువు 8. టిప్పుసుల్తాను 4. బ్రహ్మసమాజము 5. రెగ్యులేటింగ్ యాక్టు 6. ఝాన్సీరాణి 7. బెంగాల్ విభజన 8. తాజ్‌మహల్.

## భూగోళము

V ఈ క్రిందివానలో ఐదింటిని గురించి వ్రాయుము. 10

1. వ్యూజియామా 2. ప్రపంచపుపైకప్పు 3. గల్ఫుస్ట్రీము 4. డెల్టా 5. ప్రపంచపురొట్టెలబుట్ట 6. సింగపూరు.

VI ఇండియాపటమునుగీచి యీక్రిందివానిని గుర్తింపుము. 10

1. ముఖ్యతూర్పుతీరపు 3 ఓడరేవులపట్టణములు 2. పడమటిసముద్రములో కలియు రెండునదులు 3. జలపాతమునకుపకరించునది.

VII హిందూదేశమునందు జనుపపరిశ్రమకు ప్రసిద్ధిచెందినప్రదేశము. ఆ పరిశ్రమ అభివృద్ధిపొందుటకు కారణములేవి? 4

(b) టండ్రాలుఎచ్చటకలవు? వానిశీతోష్ణస్థితిని, అందలిప్రజలవృత్తులను, దెల్పుము 6

VIII యూరప్‌నందు ముఖ్యమైననదులను పేర్కొని, ఒక్కొక్కదానినిగురించి క్లుప్తముగా వివరించుము 10

## సివిక్సు

IX (a) మునిసిపాలిటి విధులనుగురించి క్లుప్తముగా వ్రాయుము. 5

(b) నీవిరామకాలమందు నీసంఘాభివృద్ధికై యెట్లు పాటుపడగలవు 5

X మనదేశ ఆర్థికదుస్థితికి కారణములేవి ? వాని నివారణోపాయములేవి? 10

100

—శ్రీమతి సి. హెచ్. నాగరత్నం-ఉపాధ్యాయిని-ముస్తాబాద

# మాదిరి ప్రశ్నపత్రము

8 వ తరగతి] సైన్సు (విజ్ఞానశాస్త్రము) [2 గంటలు

I ఈ క్రింది ప్రశ్నలకు సరియగు జవాబులిండు.

(1) మనమేల ఆహారము తీసుకొనవలయును ?
(2) మొక్కలందు పిండిపదార్థ ముత్పత్తి యగుటకు వలయు పరిస్థితులేవి ?
(3) ఒక విత్తనము నిర్మాణమును చూపు పటముగీచి, భాగములను గుర్తించుము. లేదా పుష్పముయొక్క పటము గీచి, భాగములను గుర్తించుము.
(4) పల్లేరు, బెండ, మఱ్ఱి, ఇవి ఎట్టిసాధనములవలన బీజవ్యాప్తి నొందుచున్నవి ?
(5) చేమ, పసుపు, క్యాబేజీ ఇవి ఎచ్చట ఆహారము నిలువ చేసికొనును ?
(6) కాలేయము, క్లోమము - ఇవి ఎచ్చట యున్నవి ? వీనిపని ఏమి ?
(7) హృదయమందలి గదులేవి? ఆగదులకు సంబంధించిన పెద్దరక్తనాళములేవి ?
(8) శ్వాసక్రియకును, కిరణజన్య సంయోగక్రియకును, గల భేదముల మూడింటిని వ్రాయుము ?
(9) ఆమ్లముల ముఖ్యధర్మములేవి ?
(10) ప్రాణవాయువును తయారుచేయుటకు కావలసిన సాధనములు, రసాయనికపదార్థములేవి ?
(11) ఉష్ణప్రేషణములెన్నివిధములు? అవిఏవి ?
(12) అంకుశనాళి అనగానేమి ? దాని యుపయోగమేమి ?

II. ఈ క్రిందివానికి కారణములిమ్ము.

(1) థర్మాస్ఫ్లాస్కునందు పోసిన కాఫీ త్వరగ చల్లారదు.
(2) జ్వరమానిని వేడి నీటితో కడుగరాదు.
(3) మోచేతిని ముందుకు వంచగలము, కాని వెనుకకు వంచలేము ?

III. ఈ క్రిందివానిలో ఏ ఐదింటికైన నిర్వచనములిమ్ము.

(1) మూలకములు,
(2) పరాగసంపర్కము
(3) జీర్ణము
(4) కీలు
(5) రక్తప్రసరణము
(6) కిరణజన్య సంయోగక్రియ
(7) ఫలదీకరణము
(8) దహనము.

యస్. హంసవేణి - టీచరు - తిరుపతి.

# వివేక ప్రశ్నలు

౧. అక్షరంబులైదు-అగునొక్క 'నది'పేరు
అంత్యవర్ణముడుప-అగును 'పసిడి';
ఆది-చివర-చెఱుప-అరమా 'రంగుకు';
అట్టినదిని తెల్పు-డార్యులార !

గుండేపూడి హనుమంతరావు-శనివారపుపేట.

౨. అక్షరములునాల్గు-అర్థంబు'వృక్షము';
నడిమిరెండు చెఱుప-'నాగ' మగును;
ఒగి ద్వితీయవర్ణ-ముడుప 'పాపం'బగు;
దీనిభావ మెఱిగి-తెల్పుడయ్య !

యం. వేంకట్రావు పట్నాయక్-వేణమ్మపేట

# — ఉగాది స్తవము —

నేనే నాటి యనంతకాల పరిధిన్ నీకీర్తి చిత్రించితిన్
నేనే నీమృదువీక్షణార్ద్ర విలసన్నీరేజముల్ పాడితిన్
నేనే నాడునునేడు నిర్గుణ గుణానీకమ్ము భావించితిన్.
నేనే నాభవజాలమన్నిటను వాణిన్ మొక్కి నిన్గొల్చితిన్.
జ్ఞానంబన్ బెనుకోటనిల్పితివి ప్రజ్ఞారాశి నీకోటకున్
గానంబంటిన కావ్యయంత్ర ఘటికాకౌశల్య పుంబ్రేమతో
నేనందించెడి వాక్ప్రసారములు విన్పింపంగ వేంచేయుమీ
యానందించెద బ్రహ్మదర్శనమునన్ యవ్వాణి చేదోడుగా
నాటిశతసహస్రములనాటి యుగావళి పాడినాను ము
క్కోటి సుపర్వగానసభ గోరిభజించితి గొంతునెత్తి యీ
నాటికి జ్ఞానరాగ లయ నాదరహస్యము జూపనాయె యే
నాటికి నిన్నువీడను మనంబున నిల్పుము యింతమాత్రమున్.

దుర్గమంబగు దుర్గమందున వసించు
నిన్ను ప్రాకారములతోడ నెగడివచ్చి
మన్మనో దుర్గమున నిల్పు మంత్రవీణ
వాణి యేనాడు నిల్చు నాపాణియందు.

నిరత కవితాస్రవంతిలో నిలచినిలచి
సతతగాన లహరిలోన సాగిసాగి
విడని శిల్పసౌందర్యాన వెలసివెలసి
విజయవత్సరమున ప్రేమవిరుల వెలయు
విశ్వశాంతి విభుండు సర్వేశ్వరుండు.

రమణాశ్రమం,
తణుకు.

పామర్తి వేంకటరమణరావు.

---

## పదపూరణము

(విద్యార్థులు మాత్రమే వీనిని పూరింపవలెను. చందాదారులు కానివారు తప్పనిసరిగా రెండు అణాల తపాలాబిళ్ళలు పంపవలెను. లేనిచో వారిపేర్లు ప్రకటింపబడవు.)

| | పదము | | అర్థము | | పదము | | అర్థము |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ప——ము | ... | సమూహము | 6. | ప——ము | ... | వండుట |
| 2. | ప——ము | ... | పశువు | 7. | ప——ము | ... | జలుబురోగము |
| 3. | ప——ము | ... | మాంసము | 8. | ప——ము | ... | పాము |
| 4. | ప——ము | ... | దుమ్ము | 9. | ప——ము | ... | పడమర |
| 5. | ప——ము | ... | మణివిశేషము | 10. | ప——ము | ... | పరిశుద్ధము |

—కూర్పరి శ్రీమతి చింతాడ రాజకుమారి.

# ఫిబ్రవరినెల చిత్రప్రశ్నలు

(1953 సం॥ ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడిన)

## వివేక ప్రశ్నలు

అను చిత్రప్రశ్నలకు సమాధానములు.

౧. సరస్వతి ౨. గోలుకొండ

* * *

చందా నెం. రెండు ప్రశ్నలకు సరియైన జవాబులు పంపినవారు

184 కూచిభొట్ల పరశురామశాస్త్రిగారు - హెడ్మాష్టరు - పోలుకొండ
230 శేగిడి సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం
458 అల్లంరాజు సూర్యారావుగారు - హెడ్మాష్టరు - శృంగవరము
521 అల్లంరాజు బంగారంగారు - ట్రయినింగు విద్యార్థి - అమలాపురము
76 గూడాల నాగభూషణంగారు - టీచరు మేనేజరు - గంగలకుర్రు
కొసులనాటి హనుమచ్ఛాస్త్రిగారు - టీచరు గంగవరం
566 బగ్గాం సింహాచలంగారు - టీచరు మేనేజరు పాతబగ్గాం
341 భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టిశ
278 టి. సత్యగోపాలాచారిగారు - హెడ్మాష్టరు - జాటూరు
432 పట్నాయకుని సింహాచలంగారు - మేనేజరు - తోడుము
156 దుంప రామమూర్తిగారు - టీచరు - చింతపల్లిపేట
439 ఆర్. సుబ్రహ్మణ్యం పంతులుగారు - గంగలకుర్తి అగ్రహారం
గుండేపూడి హనుమంతరావుగారు - శనివారపుపేట
695 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు - మొయిద
45 పి. వెం. గం. సత్యనారాయణగారు - హెడ్మాష్టరు - S రాయవరం
72 కుప్పిలి సూర్యనారాయణగారు - హెడ్మాష్టరు - శంబర
520 తిరువరంగం రంగయ్యగారు - టీచరు మేనేజరు - ఘాశిగంగుపేట
4 గండేటి సత్యనారాయణగారు - టీచరు మేనేజరు - ఫకీరుకిట్టలి
ఐ. శంకర నారాయణ (పాణి) గారు - వెలగలేరు
193 బాలాంత్రపు వెంకటకృష్ణారావుగారు - హెడ్మాష్టరు - నల్లూరు

## పదపూరణము - సమాధానము

| | |
|---|---|
| 1. కపోతము | 6. కన్నడము |
| 2. కలశము | 7. కమఠము |
| 3. కమలము | 8. కదనము |
| 4. కలుషము | 9. కవాటము |
| 5. కనకము | 10. కరణము |

చందా నెం. సరియైన సమాధానములు పంపిన విద్యార్థులు—

చి॥ యలమంచిలి కోటేశ్వరరావు - 7 వ తర. విద్యార్థి - పోలుకొండ
చి॥ జాస్తి వీరయ్య చౌదరి - 7 వ తర. విద్యార్థి - పోలుకొండ
చి॥ లావేటి సూర్యనారాయణ - 8 వ తర. విద్యార్థి - వండువ
521 చి॥ బంగారం - ట్రయినింగు విద్యార్థి - అమలాపురము
చి॥ రెడ్డినారాయణమ్మ - 2 వ తరగతి చోళ్ళపదం
చి॥ ముక్కా రామునాయుడు - 2 వ తర. ,,
చి॥ సూకిరెడ్డి నారాయణమ్మ - 3 వ తర. ,,
చి॥ ఏగిరెడ్డి సావిత్రమ్మ - 3 వ తరగతి ,,
చి॥ కేతిరెడ్డి నారాయణమ్మ 3 వ తరగతి ,,
చి॥ కేతిరెడ్డి లక్ష్మణరావు - 4 వ తరగతి - ,,
చి॥ బొంతు రామునాయుడు - 4 తరగతి ,,
చి॥ కేతిరెడ్డి పార్వతమ - 4 వ తరగతి ,,
చి॥ వడ్డి కనకరత్నం (పేదారమ్మ) - 4 వ తరగతి చోళ్ళపదం
చి॥ రొంపిల్లి చినతల్లి - 4 వ తరగతి - చోళ్ళపదం
చి॥ వంత్రాం అక్కులు - 5 వ తరగతి - కొట్టిశ
866 చి॥ కాశిన ఆదినారాయణరావు - విద్యార్థి - గరులియా - పశ్చిమబెంగాల్
180 చి॥ దుంప నారాయణమూర్తి - విద్యార్థి - ఆడపాపేట
చి॥ కొండ్రేగుల ముసలయ్య - 5 వ తర. విద్యార్థి - కూనిమిల్లిపాడు

---

# వింతపదములు - పొడుపు కథలు

[బాలబాలికలారా! ఈ క్రింద కొన్ని వింతపదములు, పొడుపుకథలు ఉన్నవి. వీటి సమాధానాలు చాల గమ్మత్తుగా ఉంటవి. మీరందరు వీటిని చక్కగా నేర్చుకోండి మీకు తెలిసిన పొడుపుకథలుంటే వ్రాసిపంపండి అయితే అవి చాలగమ్మత్తుగా ఉండాలి]

| పదము | జవాబు |
|---|---|
| దేశముకాని దేశము | సందేశము |
| విరికాని విరి | ఆవిరి |
| రణము కాని రణము | కరణము |
| గ్రహము కాని గ్రహము | ఆగ్రహము |
| మందు కాని మందు | భూమందు |
| వారము కాని వారము | కైవారము |
| బడి కాని బడి | రాబడి |
| లోచనము గాని లోచనము | సులోచనము |
| వరముగాని వరము | సవరము |
| సతిగాని సతి | వసతి |

కూర్పరులు: ఎ. యల్. నరసరాజు: వి. శంకరనారాయణ (పాణి)

*　　*　　*

ఎంతకొట్టినా చప్పుడు కానివి... ... ... ...కనుటెప్పలు

ఎందరు తొక్కినా కుంగనిది... ... ... ...భూమి

పట్టుకొనుటకు చిక్కనిది... ... ... ... ...పొగ

కంటికి కానరానిది... ... ... ... ... ...గాలి

ఆకు, పూత, లేనిపంట... ... ... ... ...ఉప్పుపంట

పైకి క్రిందికి ఒకటే దారము... ... ... ...వాన

ఇల్లంతా తిరిగి మూలకూర్చుంటుంది... ...చీపురు

జొడుగుట్టాలమీద ఒక్కడే రాజు... ... ...పాపుకోళ్ళు

కూర్పరులు: సుబ్రహ్మణ్యం పంతులు ఎ. యల్. నరసరాజు.

---

## ప్రకటన

ది నర్సాపురం తాలూకా ఎయిడెడ్ ప్రాథమికోపాధ్యాయ సాంవత్సరిక వార్షిక మహాజనసభను ఆచంట గ్రామములో శ్రీ జిల్లా విద్యాశాఖాధికారిగారి అధ్యక్షతను జరుపుటకు ఏర్పాటుచేసిరి. సదరు సభా కార్యక్రమము తేదీలు, ముందు తెలియజేయబడును గాన, ఎయిడెడ్ ప్రాథమికోపాధ్యాయులు, విద్యాభిమానులు సదరు సభను జయప్రదము చేయించగలందులకు కోరుచున్నాను.

ఇట్లు
గోకేటి జగన్నాధరావు, కార్యదర్శి.




# ఉపాధ్యాయుడు

ఈ విశాల విశ్వమానవ ప్రపంచంలో అత్యుత్తమస్థానాన్ని అందుకొన్న – అందుకోగలిగిన – మహాపురుషుడెవ్వడని ప్రశ్నిస్తే ఉపాధ్యాయుడని చెప్పకతప్పదు. నిజానికి ఆయనకుగల గురుతర బాధ్యతలు, గురుతర కీర్తి ప్రతిష్ఠలు, మఱియెవ్వక్తికినీ లేవనుట అతిశయోక్తిగాని – సాహసోక్తిగాని – కాబోదు. సర్వతోముఖమైనవిజ్ఞానజ్యోతిని వెలిగించి, తదీయదివ్యకాంతుల ప్రసరింపజేసి, ఈ విశాలప్రపంచంలో అలముకొన్న అజ్ఞానాంధకారాన్ని పటాపంచలుచేసి, వెలుగు దారులు నిర్మించగలిగినమహాతేజోమూర్తి ఉపాధ్యాయుడు. దేశాభ్యుదయానికి, విజ్ఞానవికాసానికి, జాతీయసమైక్యతకు, ఆ మహాపురుషుడే మూలకందము. ఆయనకుమించిన వ్యక్తిగాని, సాటివచ్చు వ్యక్తిగాని, లేడనుట నిర్వివాదము.

కాని... కాని ఆయన ఎంతగొప్పవాడో అంతదిక్కులేనివాడు. నేటి ప్రజాసంఘము లోనేమి, ప్రభుత్వదృష్టిలోనేమి, ఆయనకు తగిన గౌరవస్థానంలేదు. ఇది దేశదౌర్భాగ్యమో, ఆయన దురదృష్టమో, చెప్పవలనుపడదు. బంటుమొదలు రాజువఱకుగల సమస్త విద్యావంతులు ఆయన శిక్షణక్రింద దిద్దితీర్చబడినవారే, ఆయన పెట్టిన జ్ఞానభిక్షతో పెరిగి పెద్దవారైనవారే! కాని వారే ఆయనపట్ల కృతఘ్నులగుచున్నారు. ఆయనకుమడిమాన్యము లికున్ననుచివరకు కడుపునిండకూడు పెట్టుటకు కూడకష్టపడుచున్నారు. ప్రభుత్వయంత్రాన్ని నడిపేమహాసారథులందరూ ఆయన ప్రసక్తివచ్చేసరికి విముఖత్వాన్ని ప్రదర్శిస్తున్నారు. ఇది ధర్మమా అంటే అయ్యా! మీరూ చాలగొప్పవారు, ప్రాజ్ఞులు, మీకు సమస్త విషయాలు తెలుసు. తెలిసినవారే గోలకెత్తితే మేమేమి చెయ్యగలం? కాస్త ఓపికపట్టండి ప్రస్తుత ధనాభావం మీకు తెలియదా! ఎవరో మహాపురుషులు మీరుకూడా రచ్చకెక్కడం ధర్మమా? అంటూ ముఖప్రియాలాపాలుచేస్తూ శూన్యహస్తాలు చూపుతున్నారు. కార్యాచరణకు దిగుతామంటే 'ఖబడ్దార్', అని అధికారాన్ని చలాయిస్తున్నారు. కంఠశోష చేసుకొనిన కావేమిచేయగలదన్నట్లు ఆయన భిక్షువల్లె పైకివచ్చిన వారే ఆయనకు బిచ్చము పెట్ట నిరాకరిస్తే ఇంక ఆయనకు దిక్కెవ్వరు! ఆయన యెవరితో చెప్పుకోగలడు!

నిజానికి ఈనాటిఉద్యోగస్థుల ప్రపంచంలో ఉపాధ్యాయునికంటె తక్కువవాడెవ్వడైన ఉన్నాడేమో చూడండి. తక్కిన ఉద్యోగులంతా వస్త్రవాహనాలతో, భాగ్యభోగాలతో తులతూగుతూ వుంటే దేశాభ్యుదయానికి మూలస్తంభమైన ఉపాధ్యాయుడు ఉపవాసాలతో, అర్ధాకలితో, అలమటించి పోతున్నాడు. గౌరవం కోసమని యెన్నాళ్లు నోరు మూసుకొని కృశిస్తాడు?

షష్కప్రియాలతో కడుపునిండుతుందా? ఏ కాయ గసురులో తిని, ముక్కుమూసుకొని పడివుండటానికి ఆయన సన్యాసి కాడు గదా! ఆయనకూ గంపెడంత సంసారమున్నది. ఆసంసారాన్ని పోషించవద్దూ ఆయన? ఒక్క ఉపాధ్యాయుని విషయంలోనే ధనాభావంగాని మఱే యేవిషయాలల్లో ధనం లేకపోయింది? పెంచేవారికి పెంచుతున్నారు. ఇచ్చేవారికి ఇస్తున్నారు. జరిగేవన్నీ జరుగుతూవున్నవి. అయితే తక్కినవారివలె ఉపాధ్యాయుడు ప్రభుత్వాన్ని స్తంభింపజేయలేడు. ఆయన వోత్తిడివల్ల సద్యఃఫలితంగా జరిగే దుష్ఫలమేమీ లేదు. అందువల్లనే ప్రభుత్వం ఆయన పట్ల చులకనభావం చూపుతున్నది. ఆయన మొఱ అరణ్యరోదనం అవుతున్నది. కాకపోతే ఏనాడో నిర్ధారింపబడిన సెంట్రల్ పేకమీషన్ వారి స్కేళ్ళు ఇంతవఱకు అమలులోకి రాకపోవుటకు కారణమేమి? స్వతంత్ర భారతంలోగూడా ఉపాధ్యాయుడు దిక్కులేని వాడైనాడంటే అది దేశానికే అరిష్టదాయకము. ఈ సత్యాన్ని ప్రభుత్వం ఎంత త్వరగా గుర్తిస్తే దేశం అంత త్వరగా బాగుపడుతుంది.

ఆర్థిక దుస్థితివల్ల ఎందఱెందఱో వ్యక్తులు దుర్మరణాలకు గురిఅవుతున్నారన్న వార్తలు వింటూంటే దేహం కంపించిపోతున్నది. అలాటి వ్యక్తులలో ఉపాధ్యాయులుకూడా కలరని వినేసరికి గుండె ఆగిపోతున్నది. ఈ సంచికలో ప్రకటింపబడిన 'ఒడిపంతులు' కథ కల్పితమైనప్పటికీ అట్టి సంఘటనలు కొన్ని రాష్ట్రములలో జరుగుచున్నట్లు పత్రికలలో చూస్తున్నాము. ఈలాటివి జరుగకుండ, ఉపాధ్యాయలోకంలో అసహనం, అతృప్తి, ప్రబలకుండా, చూడవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఎంతో వుంది. అన్ని విధాలా దేశాభ్యుదయానికి మూలకారకుడైన పవిత్రజీవి-ఉపాధ్యాయునిపట్ల, ఆయన ఆర్థిక సమస్యలపట్ల, ప్రభుత్వం సత్వర చర్యలు తీసుకొనుట దేశకల్యాణ కారకమని మామనవి.

—సంపాదకుడు.

# సాయనరవిమేష సంక్రమణఫలము

ప్రజల ఆరోగ్యము సాధారణముగ బాగుండును. ఆర్థికసమస్య క్లిష్టముగ నుండును. అనవసర వ్యయము, వ్యాపారనష్టము, చోరభీతి ఎక్కువగును. పన్నులు ఎక్కువగును. రైలుప్రమాదములు చాల యుండును. ప్రయాణములలో చాలచిక్కులు కల్గును. కాని ప్రయాణసౌకర్యములకు తంతి, తపాలా విషయములకు వృద్ధికలుగును. తద్ద్వారా రాబడి హెచ్చును. సస్యాభివృద్ధి యుండును. వ్యవసాయిక కృషికి తోడ్పాటు ఎక్కువలభించును. సినిమా నాటకసమాజములకు రాబడి విశేషించును. ఓడలకు, నావికులకు ప్రమాదములు సంభవించును. పామరజనులలోను, కార్మికులలోను అశాంతి ప్రబలును. వ్యాపారాదివిషయములలో విదేశములకు సంబంధించినవి తృప్తికరముగ నుండవు. విపరీతమైన ధననష్టము నకు దారితీయును. పిన్నవయస్సువారికి మృత్యుభయమెక్కువ. శాసనసభలలో మార్పులు జరుగును. మతవిషయములలోను, కోర్టువ్యవహారములను గూర్చియు హాస్యాస్పదమైన విషయములనుగురించి తీర్పులు, నింద్యాస్పదమైన విషయములు పెక్కులు వినవలసివచ్చును. ఒక గొప్ప న్యాయాధిపతి గ్రంథ కర్త, మతకర్త, రాజకీయాధికారి, నటకుడు వీర్లకు మరణభయముగలదు. నూతనపరిశోధనలలో మొదటి మూడుమాసములు ఆశాభంగముగ నుండును. తర్వాత దూరాలోచనతో ప్రభుత్వము కార్యనిర్వహణము చేయగల్గును. తరుపరి మూడుమాసములలో కొన్నిచిక్కులు వీడును. యుద్ధభీతిమాత్ర ముండును. అనంతరము దేశపరిస్థితులు దినదినాభివృద్ధి గాంచును. ప్రభుత్వముయొక్క ఓర్పు,శాంతగుణము, ఆలోచనా పటిమ లోకములో ప్రకటితమగును. సాయనలగ్నాధిపతియైన శని వరుణునితో గలసి, భాగ్యమందుండుట వలనను, లగ్నాధిపతి వక్రములో నుండుటవలనను దేశపరిస్థితులు, రాష్ట్రవిషయములు మున్నగునవి సందే హములకును, చిక్కులకును అవకాశమిచ్చును. కాశ్మీరుసమస్య కూడ అట్టిదే. అయినను ఇవిపరిష్కారము కాగలవు. దేశము విజయసం॥లో తుది ఆరుమాసములలో సుభిక్షముగ నుండును.

## మాసఫలము - మార్చి 15 నుండి ఏప్రిల్ 14 వరకు

### అశ్విని భరణి కృత్తిక 1 పాదం మేషరాశి.

మీ ఆరోగ్యమును కాపాడుకొనవలెను. ఉద్యోగవ్యాపారములలో చిక్కులు రాగలవు. తొందర వలదు. మిత్రులవలనమోసము. కాని అధికార ప్రాపకము లభించును. రావలసినసొమ్ములురావు. ప్రయాణ ములు కూడవు. కంట్రాక్టులుచేయరాదు. మార్చి నెలలోకన్న ఏప్రిల్ లో కష్టములెక్కువ.

### కృత్తిక 2, 3, 4 రోహిణి, మృగశిర 1, 2 వృషభం.

ఆరోగ్యభంగము, స్థానచలనము, బాకీలుకొన్నిపోవును, మిత్రులనుండి దుర్వార్త. మార్చి, 27 ప్రాంతముల ధనలాభము, శత్రుబాధ, వ్యాపారనష్టము. ఏప్రిల్ లోగల్గును. ఏప్రిల్ రెండవవారములో ఉద్యోగములో చిక్కులు. కార్యవిఘ్నములు. గృహచిక్కులు. తమకు లోబడనివారే తమమాటవినరు.

### మృగశిర 3, 4, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా. మిథునం,

ఆరోగ్యమును జాగ్రత్తగా చూచుకొనవలెను. మార్చి 3వ వారములో కలహములో వ్యవహార చిక్కులు, నష్టములు కల్గును. 4 వ వారములో వ్యాపారలాభము. ఏప్రిల్ మొదటివారములో నూతన మార్పులు. రెండవవారములో సంతాన కళత్రములకు సౌఖ్యముతక్కువ. స్థిరాస్తి సంబంధమైన ఏర్పాట్లు చేయుదురు. అధికారప్రాపకము.

### పునర్వసు 4, పుష్యమి, ఆశ్లేష. కర్కాటకం

మార్చి 3, 4 వారములలో ధనవ్యయము, వ్యవహారజయప్రయాణములు. కంట్రాక్టులు వగైరాలు అనుకూలము. ఏప్రిల్ 1, 2 వారములలో ఉద్యోగాదులలో అనుకూలత లుండునట్లు కనుపించును. కాని కొన్నిఇబ్బందులు రావచ్చును. స్థానచలనము కల్గును. ఆర్థికచిక్కులు, గృహసౌఖ్యము తక్కువ.

### మఖ, పుబ్బ, ఉత్తర 1పా. సింహం

దూరప్రయాణములు, దావాలలో విజయము. రావలసిన బాకీలు వసూలగును. వ్యాపారకార్యము లకు అనుకూలము. మార్చి 4వ వారములో లోగడచిక్కులను గడచిగట్టెక్కుదురు. యంత్రాది వ్యాపార

లాభములకు ఏప్రిల్ మొదటివారంలాభం. రెండవవారం విద్య. ఆరోగ్యవిషయములలో శ్రద్ధఅవసరము లేనిచో కష్టములకు లోనగుదురు.

ఉత్తర 2, 3, 4, హస్త, చిత్త 1, 2పా, కన్య.

మార్చి 3వ వారములో చిక్కులు, సంతానములో అనారోగ్యము, ధననష్టము. 4వ వారములో వ్యాపారలాభము. ఏప్రిల్ మొదటివారము ఉద్యోగములో మార్పులు. ధననష్టము, రెండవవారములో కళత్రఅనారోగ్యము. అనవసర కలహాములు, మనస్సునకు హాయియుండదు. ఇతరులవలన రావలసిన సొమ్ములు కొన్నివచ్చును. వారసత్వపు ఆస్తిలాభము.

చిత్త, 3, 4, స్వాతి, విశాఖ 1, 2, 3 తుల

మార్చినెలలో వ్యాపారలాభము, జాయింటుకు అనుకూలము విద్య వ్యవహారాలలో కొన్ని ప్రతిబంధకములు కలుగును. ఏప్రిల్ 1వ వారములో నూతనమార్పులు, అధికారప్రాపకము, రెండవవారములో నలుగుడు, కలహములు సంతానమునకు చిక్కులు, ఉద్యోగములో చిక్కులు రావచ్చును. ఇతరులతో విరోధములు ఏర్పడును. కొని కష్టములకు లోనగును.

విశాఖ 4, అనూరాధ, జ్యేష్ఠ, వృశ్చికం

ఆరోగ్యము బాగుండును. కార్యములయందు తొందరలేనిచో విశేషలాభము. నౌకర్లతో విరోధము. ప్రయాణములలో విఘ్నములు. మార్చి 3వ వారములో మార్పులు కలవు. 4వ వారములో గృహలాభము, ధనలాభము. ఏప్రిల్ మొదటివారములో నూతన వ్యాపారమునకు, ఉద్యోగలాభమునకు మంచిది. రెండవవారములో జాయింటువ్యాపారములోగాని దావాలలోగాని విజయము, లాభము చేకూరును. స్త్రీసౌఖ్యము తక్కువ.

మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా. ధనుస్సు

మార్చినెలలో సత్కార్య, మంచి ఆలోచన, ఉత్సాహముగనుండును. పుత్రులవలని సౌఖ్యము. ప్రయాణములు, ఏప్రిల్ లో నూతినయత్నములు, కొత్తవారితో స్నేహము. ధనవ్యయము. అధికారవర్గముతో లాభము, అనవసర తర్కములు, మిత్రులవలన మోసము, మనస్సునకు అశాంతి. వ్యాపారవిషయములలో శ్రద్ధ.

ఉత్తరాషాఢ 2, 3, 4 శ్రవణం ధనిష్ఠ 1, 2 పా. మకరం

గృహవిషయములు ఎక్కువగ నాకర్షించును. శుభకార్యములు చేయుదురు. నూతన మార్పులకు మార్చినెల చాల అనుకూలము. ఇతరులవలన లాభము నెలాఖరులో వచ్చును. ఏప్రిలులో తొందరవలన కొన్నిచిక్కులు, స్త్రీ సౌఖ్యము తక్కువ. ధనవ్యయము. స్థిరాస్తికి సంబంధించిన పేచీలు, మిత్రమోసము.

ధనిష్ఠ 3, 4, 5 శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా. కుంభం

మార్చినెలలో ప్రయాణములకు అనుకూలము, బంధు సమాగమము, విద్యాకౌశల్యము. ఏప్రిల్ లో భూములు మొ॥ మరమ్మతులు, మార్పులుచేయుటకు వీలైనకాలము. ఇతరులవలన రావలసినసొమ్ములు కొంత ప్రయాసమునిాద రెండవవారములో లాభించును. మీకు సందేహములు జాస్తి, అయినను నిదానము మీద మీకు కార్యజయముగలదు.

పూర్వాభాద్ర 4, ఉత్తరాభాద్ర, రేవతి. మీనం

ఆర్థికసమస్య మిమ్ముల నెక్కువగ బాధించును. క్రయ విక్రయములు చేయుదురు. మార్చి 28 ప్రాంతములో ధనలాభము గలదు. ఏప్రిలులో చిక్కులను అన్నిటిని క్రమముగ తొలగించుకోగలరు. ఉద్యోగవ్యాపారములకు అనుకూలము. మిత్రులు మోసగింపజూతురుగాని మీ బుద్ధిబలముచే తప్పించుకో గలరు. శుభము తక్కువ. ప్రయాణలాభం.

☞ యీ మాసఫలములు మీ జాతకములనుబట్టి మారవచ్చును.

లక్కావఝుల సర్వయ్య,
జ్యోతిష్కులు, అగ్రహారం, ఏలూరు.




రావివలస :

ది 21-2-53 తేదీని పార్వతీపురంతాలూకా, రావివలస సెంటరు సమావేశము శ్రీ సీనియరు డి॥ ఇనస్పెక్టరు శ్రీ ఆదిభట్ల శ్రీకంఠశర్మశాస్త్రి B. A. B. Ed గారి అధ్యక్షతను, శ్రీ జూనియరు డి. ఇ. శ్రీ పాకల వెంకట సూర్యనారాయణగారి ఉపాధ్యక్షతను, జరుపబడెను.

నేటి సివిక్సుపాఠమును ఆధారముగా జేసికొని సమాజములో గల పౌరుని ధర్మములు, భావి పౌరులు ఉపాధ్యాయుల శిక్షణపై ఆధారపడి యుండుటచే ఉపాధ్యాయుని సేవాధర్మములు, ద్రోణుడు, చాణక్యుడు, దాదాజీ ఖాండదేవ్ మొదలగు గురుకుటుంబమునకు చెందిన యుపాధ్యాయులు మున్ముందు యెట్టి శుభముల నందింప గలుగునదియు, ఉపాధ్యాయులపట్ల ప్రభుత్వము చూపదగు సహాయ సంపదను గూర్చి, శ్రీ సీనియరు డిప్యూటీ యినస్పెక్టరువారు ఒక గంటకాలము విపులముగా ఉపన్యసించిన పిమ్మట కార్యదర్శి వందనములతో సమావేశము ముగింపబడెను.

జి. వి. అప్పారావు, సెక్రటరీ.
టి. ఎ. రావివలస, ది 21-2-53.

గన్నవరము :

ది 3—2—53 తేదీన శ్రీ కృష్ణాజిల్లా - గన్నవరం తాలూకా - బోర్డు ప్రాథమిక ఉపాధ్యాయ సంఘసభకు అధ్యక్షునిగా శ్రీ పరిటాల సూర్యనారాయణగారిని, శెక్రటరీగా శ్రీ వేదాన్తము శ్రీనివాసాచార్యులుగారిని, మరి ఆర్గనైజింగు కమిటీ సభ్యులను యెన్నుకొనడ మైనది.

వి. శ్రీనివాసాచార్యులు, కన్వీనర్.

## ఆంధ్రా ఎలిమెంటరీస్కూలు టీచర్సు ఫెడరేషన్ అమలాపురం

ది 14-2-1953 తేదీ శనివారంరాత్రి 8-0 గం॥లకు అమలాపురం టవున్ మునిసిపల్ గరల్సు స్కూలు భవనమునందు రాష్ట్ర ఫెడరేషన్ ప్రశిడెంటు శ్రీ చెన్నుపాటి లక్ష్మయ్యగారి ఆధిపత్యమున వర్కింగుకమిటీ సమావేశము జరుపబడి, అమలాపురం తాత్కాలికకమిటీ వారినుండి ఎక్కౌంట్సు నివేదికలు తీసికొనబడినవి.

ది 15-2-53 తేది ఆదివారం ఉదయం 8-0 గం॥లకు తాలూకా కమిటీ ఎన్నికలు ప్రశాంతముగా జరుపబడి ఈ క్రిందివారు పోటీలేకుండా తాలూకా డెలిగేట్లచే ఏకగ్రీవముగా ఎన్నుకొనబడినారు.

ప్రశిడెంటు.— శ్రీ దువ్వూరి జానకిరామ సోమయాజులుగారు
వైస్ ప్రెసిడెంటు:— శ్రీ పడాల దుర్గారావుగారు
కార్యదర్శి:— శ్రీ కదలి గంగిశెట్టిగారు
సహాయకార్యదర్శి:— శ్రీ చిక్కం నాగేశ్వరరావుగారు
కోశాధికారి:— శ్రీ జి. వి. ఎస్. ప్రకాశశర్మగారు

ఈ క్రొత్తకమిటీవారికి మధ్యాహ్నం 12 గం॥లకు పాతకమిటీవారు యావత్తు రికార్డు స్వాధీన పర్చడమైనది.

మధ్యాహ్నం 2 గం॥లకు మహాజనసభ శ్రీ పి. రామచంద్రరావు (M. A) ప్రిన్సిపాల్ అమలాపురము వారి ఆధిపత్యమున జరుపబడినది. సభకు 500 మంది ఉపాధ్యాయులు హాజరైరి. శ్రీ కె. రామభద్ర

రావుగారు B. A. B. Ed హెడ్మాష్టరు, పేరూరు. శ్రీ సి. వి. రామకోటేశ్వరరావుగారు టీచరు, చిక్కవోలు. శ్రీ కె. కృష్ణమూర్తిగారు ఆహ్వాన సంఘాధ్యక్షులును అమలాపురము మునిసిపల్ చైర్మన్ గారు ఉపాధ్యాయులయొక్క కష్టజీవితమును గురించి విపులముగా ఉపన్యసించిరి సభజయప్రదముగా 6 గం॥లకు ముగింపబడినది. వందన సమర్పణము. "జనగణమన"

నేదునూరు,
ది 16—2—1953.

ఇట్లు
గోసాల జగన్నాధరావు, మాజీకోశాధికారి
అమలాపురం తాలూకా టీచర్సు ఫెడరేషను.

# పల్నాడుతాలూకా ప్రాథమికోపాధ్యాయ కవున్సిల్ సమావేశం

## నూతన కార్యవర్గపు ఎన్నికలు

ఈ నెల 22 వ తేదీన గురజాలలో శ్రీ. పి. పీటరుగారి అధ్యక్షత క్రింద తాలూకా ప్రా. ఉ. కవున్సిల్ సమావేశం జరిగింది. తాలూకాలోని అన్ని సెంటర్ల నుండి కవున్సిలర్లు హాజరయ్యారు. ప్రార్థనానంతరం శ్రీ. యన్. శేషయ్యగారు తుమ్మురుగోడు బోర్డు హైయ్యరు ఎలిమెంటరీ స్కూలు టీచరు, శ్రీ కొట్టి శ్రీరాములుగారిని గూర్చి వ్రాసిన హరికథలోని పద్యభాగాలను శ్రావ్యంగా చదివారు. తరువాత తాలూకా నూతన కార్యవర్గ ఎన్నికలు జరిగాయి. శ్రీ ఆర్. నరసింహారావుగారు అధ్యక్షులుగాను, శ్రీ కె. సీతారామయ్యగారు ఉపాధ్యక్షులుగాను, శ్రీ. ఆర్. రామేశ్వరరావుగారు కార్యదర్శిగాను, శ్రీ జి. శ్రీహరిరావుగారు సహాయకార్యదర్శిగాను, మరి 8 మంది సభ్యులుగాను ఎన్నికయ్యారు. మహిళలకు ప్రత్యేకముగా సీటు యివ్వబడింది. ఉపాధ్యాయసమస్యలపై రాయబారాలు, సభలు వెళ్ళుటకు ఏడుగురితో కూడిన ఒక ఉపసంఘాన్ని ఎన్నుకొన్నారు. ఈ ఉపసంఘమువారు "అనవసరపు ట్రాన్స్ఫర్లు, అక్టింగ్ టీచర్ల గ్రాంట్యుటీ" యున్నగు సమస్యలపై మార్చి నెల 21 వ తేదీన రాష్ట్ర, జిల్లా సంఘాధినేతలతో గుంటూరు D. E. O; A. E. L చర్చి అధికారులు, జిల్లాబోర్డు ప్రెసిడెంటుగార్ల దగ్గరకు రాయబారం వెళ్ళుటకు తీర్మానించారు. తాలూకాలో ఉపాధ్యాయసభ్యత్వం చురుకుగా చేర్పించబడుతూంది. ఫిబ్రవరి నెలాఖరుకు చేరిన సభ్యత్వం 210 వుంది (నూటికి 50 మంది).

దాచేపల్లి,
26-2-53.

ఆర్. రామేశ్వరరావు,
పల్నాడు తాలూకా ప్రా. ఉ. సంఘకార్యదర్శి.

పాలవలస కమిటి :

ది 21—2—53 తేదీని సాధారణ ద్వితీయ ఉపాధ్యాయ కేంద్రసంఘసమావేశము(Center class) జరుపబడెను. కార్యక్రమము యథావిధిగా జరిగెను. పిమ్మట యీ కేంద్రమునకు కోశాధిపతిగా మండ గ్రామ పాఠశాల టీచరు మానేజరు శ్రీ మేడిద వెంకట్రావుగారిని సభ్యులు ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి.

యీ దినముననే సాయంకాలము సుమారు గం 4 లకు యీ గ్రామస్థుల ద్రవ్యసహాయముతో యీ గ్రామపాఠశాల తరపున వాలీ, రింగ్ టెన్నిసుకోర్టులు తెరువబడెను. మా పాఠశాలయెడ గ్రామీణులు చూపిన ఆదరాభిమానములకు మా కృతజ్ఞతాభి వందనములను యీ పత్రికారత్నముద్వారా సమర్పించుకొనుచున్నాము.

ఇట్లు.
పట్నాయకుని నరసింహులు, Tr. మానేజరు శక్రటరీ
T. A. పార్వతీపురం యేజన్సీ రేంజి.

౬౫

వెలువడుచున్నది — ప్రతులకు వ్రాయుడు.

# ఉపనిషత్సారము

గ్రంథకర్త: శ్రీ నిర్వికల్పానంద స్వామి.

వీరు యోగవాసిష్ఠము — భగవద్గీత — భారతీయ తత్త్వశాస్త్రము — ప్రపంచ మతములు — మున్నగు గ్రంథములను రచించియున్నారు.

భారతీయ సంస్కృతికి ఖండఖండాంతరముల యందు యశస్సును గూర్చినవి ఉపనిషత్తులు. మాక్సుముల్లర్, షోపెన్‌హార్ మున్నగు పాశ్చాత్య పండితులచే విరివిగ ప్రశంసింపబడినవి.

హిందూమతమునకు మూలాధారమగు ప్రస్థానత్రయాంతర్గతమగు దశోపనిషత్తుల అనువాదము ఈ గ్రంథము.

తత్త్వమును గ్రహింపగోరు వారికిని, ఆర్యసంస్కృతిని పరీక్షింపగోరు వారికిని, మనశ్శాంతిని బొందగోరువారికిని, ఇది ముఖ్యపఠనీయ గ్రంథము.

భారతీయ సంస్కృతికిని, ధర్మమునకును, శిరోభూషణములగునవి ఉపనిషత్తులు.

సంస్కృత భాషాజ్ఞానమంతగా లేనివారందరికిని అందుబాటులో నుండునటుల మహత్తర భావములు సరళభాషలో వ్రాయబడినవి.

ఇందు ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయములు కలవు. ఛాందోగ్య బృహదారణ్యకము లందలి ముఖ్య ప్రకరణములు కలవు.

ఇట్లు,

రామా అండ్ కో.,

ఏలూరు, ప.గో. జిల్లా.

ANDHRA RASTRA PRARAMBHAVIDYA
Regd. M.N. 3766 Vol. 41. - No. 12



Edited by Sri M. Venkata Ratnam Garu, B. A., & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.